**Nene Ee Kshanam**
Anthology of Poems in Telugu

By **B.V.V. Prasad**



First Edition : July 2006

Copies : 1000

Cover Page : Annapurna South, Nepal, Photo by E.Wesker
Back Cover : The Pradakshina Path of Arunachala.

Published By :
B.V.V.Prasad
# 23-12-21, sajjapuram,
TANUKU - 534 211, W.G.Dt.,
Email : prasadbvv1@gmail.com

Printed at :
Sri Ratna Printers
Muttangivari Street,
RAJAHMUNDRY. Ph. 2476345

Price : Rs. 20

మీరు అంటున్నారు “ నువ్వూ, నేనూ ఒకటే ” అని
ఎంత ధృడమైన ప్రేమ
“మీరూ, నేనూ వేరు”అనే బలహీన ప్రేమికుడిపైన!

భగవాన్ శ్రీ రమణ మహర్షికి

ఆత్మీయులు
కొప్పర్తి, జీయస్వీ నరసింహారావు, ఆలపాటి రాంబాబు,
గోపిరెడ్డి రామకృష్ణారావు, నామాడి శ్రీధర్, రెంటాల శ్రీ వేంకటేశ్వరరావు,
కొవ్వలి ఆంజనేయ శర్మ, హరనాధ్, రసరాజు, రత్నమాల, ఎమ్మెస్ సూర్యనారాయణ,
గొట్టుముక్కల శ్రీనివాసరాజు, బాలాజీ వర్మ, మద్దాల శ్రీనివాస్, రెంటాల సుబ్రహ్మణ్యం,
లంకా వెంకటేశ్వర్లు, జియల్ఎన్ మూర్తి, ఎస్.వి. రామశాస్త్రి, కృష్ణమోహన్ గార్లను

కె.శివారెడ్డి గారిని, ఓల్గా గారిని,

సాహిత్యం ద్వారా పరిచయమై, నా జీవితాన్ని స్నేహ సంపన్నం చేసిన ఎందరో కవిమిత్రులని,
సాహిత్యవేత్తలని, సాహిత్యాభిమానులని,

కవితల్ని ప్రచురించిన పత్రికలు, సాహిత్య సంచికల వారిని,
ప్రసారం చేసిన ఆకాశవాణి, దూరదర్శన్ వారిని,

ఇంకా
అమ్మ విజయలక్ష్మి, నాన్న అచ్యుతం గార్లనీ,
సహచరి మాలతి, పిల్లలు గాయత్రి, భార్గవి లని,
ఇతర బంధువుల్నీ, మిత్రులనీ, శ్రేయోభిలాషులనీ...

అందరినీ తలచుకొంటూ,
అందరిలోంచీ ప్రకటితమౌతున్న జీవనోత్సవానికి నమస్కరిస్తూ..

## ఇ'వీ క్షణాలు'...

# నాటిన మబ్బు

ఎండ కురిస్తే
చెట్టునిండా
ఆకుపచ్చని చినుకులు

చీకటి కురిస్తే
చెట్టునిండా
నల్లని మబ్బులు

గాలివీస్తే
మబ్బుల్లోని చినుకుల్ని
కురుస్తోంది చెట్టు

*27.5.1995*
సృష్టి . వార్త దినపత్రిక *10.8.1996*

# విశ్వరూపి

చందమామ
వామనుడిలా
వెన్నెల పాదాలని
నింగీ, నేలలపై మోపింది
మూడో పాదానికి
నా హృదయాన్ని చూపాను
ఇక రహస్యాంతర లోకాలకి అణగి
కవిత్వాన్నయి ప్రకాశించాలి

*13.6.1995*
*చైతన్యకవిత సంచిక : 24*

# నదీ - ఒడ్డూ

వెన్నెలరాత్రి కంటే
చీకటిరాత్రి బావుంటుంది

వెన్నెలనదిలో
చూపులెంతసేపూ
పడవ చంద్రునిలోనే కూర్చుంటాయి

చీకటిలో అవి
తారల ఇసుక మైదానంలో
గంతులేస్తూ ఆడుకొంటాయి

*13.6.1995*
సృష్టి . వార్త దినపత్రిక *1996*

# అశ్రుబింబాలు

ఆమెని ప్రేమించాను

మాపై శరీరాలు కప్పిన
అన్ని ఛాయలనీ విప్పుకొని
తొలి ప్రాణ స్పందనతో
మా చూపులు స్పృశించుకొన్నాయి

నిను ప్రేమిస్తున్నానని
మా ప్రాచీన ప్రేమని
ఆమెకి జ్ఞాపకం చేసాను

ఆమె అమ్మయి నా పసితనాన్నీ
నేను అమ్మనయి ఆమె పసితనాన్నీ
రక్షించుకోవాలని కలగన్నాం

మా ప్రేమతో
రోజుకో సూర్యుని వెలిగించాలనీ
రాత్రి చంద్రరేఖల్ని చిత్రించాలనీ ఊహించాం

ఆమె నా కొలనులో వెన్నెలైంది
నాలోకి ఎవరే మాటల్ని విసిరినా
చెదిరిన అల అలకీ
ఆమె అల్లుకుపోయింది

కలిసి ఉన్నా, దూరమైనా
మా కనులు అశ్రువులతో నిండేవి
అశ్రువులలో ఎపుడూ
మా ప్రతిబింబాలు తొణికిసలాడేవి

. . .

ప్రేమల్ని వేరుపరిస్తే
ప్రపంచానికెంత సంతోషం
హృదయం మాత్రం, కన్నీటితో
ప్రేమకి బదులు ప్రపంచాన్ని కడిగేసుకొంది

. . .

ఆమె ఉన్న ప్రపంచం కదా ఇది
ఈ ప్రపంచాన్ని మరింత ప్రేమించాలి
నా ప్రేమ అలలై పరుగులెత్తి
అజ్ఞాతతీరాన ఉన్న ఆమెని తాకాలి

ఈ ప్రపంచమనే చిన్నిబంతిపై
ఎప్పటికీ మేం కలిసే జీవిస్తాం
ఎక్కడ ఉన్నా ఒకే సూర్యకాంతి
మమ్మల్ని లాలనగా తాకుతుంది

*15.2.1996*

*సాహితి . ఆంధ్రభూమి దినపత్రిక 8.7.1996*

# రెండుమాటలు

అబ్బాయి పుడితే
తండ్రి మాత్రమే అయ్యేవాడిని
అమ్మాయి పుట్టి
తల్లిని కూడా అయ్యాను

. . .

స్త్రీని
మగాడితో సమం కమ్మని
ఎలా శపించను?

మగాడిని
స్త్రీతో సమం కమ్మని
దీవిస్తాను

*17.3.1996*
*29.6.1996*
ఆహ్వానం అక్టోబర్ *1996*

# పాపాయితో దేవుడు

నిద్రలో పాపాయి నవ్వింది
తల్లి చెప్పింది
"పాపాయితో దేవుడు మాట్లాడుతున్నాడ"ని

మనకి దేవుడు లేడు
కానీ
దేవుడంటేనే లేకపోవటం
మబ్బు మరకలు లేని నిర్మలాకాశం దైవం

మన నిండా మబ్బులు పట్టి
రంగులూ, మెరుపులూ, శబ్దాలూ, జల్లులూ వెదజల్లుతాం
మనకి దేవుడు ఉండడు

కానీ,
ఏమీ లేని నిర్మలాకాశం వంటి పాపాయితో
లేకుండా ఉన్న దేవుడు మాట్లాడితే
ఆశ్చర్యమేముంది!

*14.4.1996*

# ప్రపంచాలు

మనిషి ఒక ప్రపంచం

బలం - బలహీనత
వెలుతురూ - చీకటి
ఒక ప్రపంచానికి ఒక మిశ్రమం

ప్రతి ప్రపంచంలో
పూలుంటాయి. ఎడారులుంటాయి

ప్రతి ప్రపంచంలో ముప్పాతిక
కన్నీటి సముద్రమూ ఉంటుంది

బహుశా,
ప్రతి ప్రపంచంలో
తనకే తెలియని అనంతాకాశం ఉంటుంది

*29.4.1996*
*చైతన్యకవిత సంచిక : 24*

# ఇరుతీరాల నడుమ

మా మధ్య
పాపాయి నిదురించటం
ఎంత బావుందీ!

ఇన్ని రోజులూ
మేం  నదులమో తెలీదు
నదీ తీరాలమో తెలీదు

మాలోంచి ప్రవహించి
పాపాయి
మమ్మల్ని  నదులుగా ఋజువు చేసింది

పాపాయి
మా మధ్య  ప్రవహించి
మమ్మల్ని నదీ తీరాలనూ చేసింది

మా మధ్య
పాపాయి ప్రవహించటం
ఎంత బావుందీ!

*10.10.1996 రాత్రి 12.40*
*ఆంధ్రజ్యోతి వారపత్రిక 1.11.1996*

# ఒక ప్రశ్నార్థక జాతి

మనిషి వినా
భూమ్మీద అసహజమేముంది?

భూమినో
నింగిపొరనో
మనస్సునో
గాయపరచి గర్వించే మనిషి వినా
భూమ్మీద భయానకమేముంది?

పువ్వులా
తొలివెలుగులా
నవ్వులా
విప్పారలేని  మనిషి వినా
భూమ్మీద  జాలిపడాల్సిందేముంది?

పర్వతాల, లోయల మధ్య
వృక్షజాతుల మధ్య
వేలాది ప్రాణుల మధ్య
ఒకటి కాలేని ఒకే ఒక్క మనిషి వినా
భూమ్మీద అసహజమేముంది?

*1.10.1996*
ఆంధ్రజ్యోతి వారపత్రిక *8.11.1996*

# హిమస్వప్నం

తొలి చలిరోజుల్లో
దుప్పటి లేకుండా పడుకొంటే
నేనే ఒక మంచుఖండమైనట్టు
తెల్లని ఆలోచన ఏదో
పెంగ్విన్ లా రెక్క లల్లార్చుతుంది

ఉక్కపోసిన రోజుల తర్వాత
మంచు నీరయినట్టూ
నీరు మంచయినట్టూ
నిద్రలూ, మెలకువలూ
చల్లగా, చప్పుడేమీ లేకుండా
రోజుల పేజీలని తిరగేస్తాయి

కానీ
నీడ నిచ్చిన చెట్టు
పత్రాలు రాల్చుతుంటే
ఎటో పోయిన అనాథని వెదుకుతూ
నాలో ఒక మంచుపగులు వ్యాపిస్తుంది

*12.10.1996*
*సాహితి . ఆంధ్రభూమి దినపత్రిక 7.7.1997*

# తూనీగల గురించి

మేం గదిలో పాటలు పాడుకొంటుంటే
ఇద్దరు చిన్నారి తూనీగలు
గుమ్మాల లోంచి
అటూ, ఇటూ ఎగురుతుంటారు

మాకు పాటలు పాడుకోవటమే తెలుసు
పాట కావటమంటే ఏమిటో
వాళ్లకి తెలుసు!

*2.11.1996*
*ఆంధ్రజ్యోతి వారపత్రిక 1.12.1996*

# బిగ్ బాంగ్

నీవే
గెలాక్సీలు. బ్లాక్ హోల్స్

నీవే
భూమీ
దానిమీద అడవీ. సముద్రమూ

నీవే
ప్రాణీ. ప్రాణులూ
మానవుడూ. మానవులూ

నీవే
ప్రేమికుల
తొలి, మలి, చివరి ముద్దులు

నీవే
కల. కల చెదరటం

నీవే
నీవే అనే సాహసం
నీవు కావనే సాహసం

*4.11.1996*

*ఆంధ్రజ్యోతి వారపత్రిక 29.11. 1996*

ఒక మహావిస్ఫోటనం నుండి విశ్వం ఆవిర్భవించిందని సైన్సులో ఒక ప్రతిపాదన వుంది.

# తూనీగ

ఎగురుతూ, ఎగురుతూ
గాలిలో దిగిన బాణంలా
తటాలున ఆగుతుంది తూనీగ!

కదలని తూనీగకి
పైన, కదలని ఆకాశం
కింద, కదలని తటాకజలం!

తటాకంలోకి ఎవరో విసిరినా
ఎలా పడాలో తెలియని మట్టిబెడ్డలా
ఆగుతుంది తూనీగ!

ధ్యానాన్ని విప్పుకొన్న
ఒకటి, రెండు రెక్కల కదలికల తర్వాత
కదిలే కాలం గుర్తొస్తుంది
తూనీగకీ, నాకూ!

పల్చని నీటిలో
తన ప్రతిబింబాలనో, తననో
వెదుకుతూ తూనీగా,

చిక్కని ప్రపంచంలో
నా ప్రతిబింబాలనో, నన్నో
వెదుకుతూ నేనూ
అక్కడినుండి విడిపోతాం

*17 నవంబర్ 1996*
*సాహితి . ఆంధ్రభూమి దినపత్రిక 5 మే 1997*

# కదిలే నావలు

నిద్రలో
తల్లి ఒత్తిగిలి మీద పడిందేమో
పాపాయి కెవ్వు మంటుంది

అప్పటివరకూ
వేరు వేరు చీకటి లోకాలలో
కలిసి ప్రయాణిస్తున్న ఇద్దరూ
ఒకరి ముఖంలోకి మరొకరుగా
మేలుకొంటారు

ఒక్క క్షణం
రెప్పల వెనుక ఒకరినొకరు భద్రపరచుకొని
మరలా వేరు వేరు లోకాలకి
కలిసి ప్రయాణం మొదలుపెడతారు

వారి నిద్రలోనూ, మెలకువలోనూ
భాగం కాలేని నేను మాత్రం
సముద్రం ఒడ్డున దీప స్తంభమై
కదిలే నావలని చూస్తూ నిలుచుండిపోతాను

*26.11.1996* రాత్రి *1.15*

# ఒక సౌందర్యం ఒక విధ్వంసం

సముద్రాన్ని తవ్వుకొని బైటపడ్డ పురాప్రకృతి తుపాను
సముద్రంలోంచి దూకిన మహాశక్తి పదఘట్టనకి
భూమి చినుకు పడ్డ పచ్చనాకై వణికింది

భూమీ, సముద్రం, నేనూ, ఆకాశం
ఒకరిలోకి ఒకరం వ్యాపించిపోయాం
ఊగే చెట్ల లాగే నాలోని మనిషీ
శతాబ్దాల ముందుకీ, వెనుకకీ కదిలిపోయాడు

తొలి ప్రేలుడుతో విడిపోయిన సమస్తం
బెంగ సుడి తిరిగి ఏకమయే ప్రయత్నమే చేసిందో
రాత్రి నిద్రించే ధాత్రికి నల్లబిలం కలే వచ్చిందో..

ప్రాణం, హరితం, ఇళ్ళూ, వేళ్ళూ
మనిషీ, పిశాచం, పశువూ, పక్షీ
ఏకమై, అనేకమై విడిపోతూ, కలబడుతూ..
తుపాను ముగిసింది. కన్ను మూసింది

. . .

ఒక కొత్త అల వణికే తీరాన్ని నిమిరింది
కానీ, మనిషి నిద్రలో, మెలకువలో, నెత్తురులో, చూపుల్లో
జలశంఖం చుట్టిన వృత్తాల వృత్తాంతాలు, గాలి నీడలు

భూమి తిరుగుతోంది
గుండ్రంగా త్రిప్పి వదిలిన పిల్లవాడికి కనిపించేంత
స్పష్టంగా, మృదువుగా, నిదానంగా, వేగంగా
ఒక్కలాగే తిరుగుతోంది భూమి

తుపాను పీడకలతో
ఎర్రగా, అశాంతిగా నిద్రలేని కన్నులాంటి సూర్యోదయం
మృతుల్ని చూపే కిరణాల మృత్యోదయం

మృతులు
ప్రాణం లేనీ, ప్రాణం పోనీ, ప్రాణం తీసే మృతులు
చెట్టులాంటి మనిషీ, మనిషిలాంటి చెట్టూ
కూలిన వైనాల కన్నీటి చారల విషాద తంత్రులు
ఊరూ, స్మశానం వేరుకాని దు:ఖపతాకం

చెట్టు కూలిన చోట చెట్టంత శూన్యం
మనిషి చివరి శ్వాస తరువాత
అతను నడిచిన నేలంతా, సముద్రమంతా
మనిషి భవిష్యత్తంత శూన్యం

. . .

తుపాను శూన్యంలో పాఠాలు రాసిపోయింది
తీరం దాటే తుపాను ప్రపంచతీరం దాటి
మనిషిలోకీ, కలల్లోకీ జ్వరమై ప్రవేశించి శుభ్రపరచాలి

జ్వరపడ్డ సముద్రం తేరుకొని తీసుకొనే అలల శ్వాసలా
మబ్బుల్లో మళ్ళీ మొలిచిన వెలుగు పచ్చికలా

చేలల్లో తిరిగి విచ్చుకొన్న పచ్చని కిరణాల్లా
మనిషి కూడా ఇంటినీ, కలల్నీ సరిచేసుకోవాలి

తుపానుల్తో స్నేహానికీ, తుపానుల్తో యుద్ధానికీ
మనిషి నిలబడ్డ సముద్రంలాంటి నిలువెత్తు తుపాను కావాలి

*28.11.1996*

*ఆంధ్రజ్యోతి వారపత్రిక 20.12.1996*

# చిన్నప్పటి బొమ్మ

పాపాయి చేయి
లేత అలలా నా ముఖాన్ని తాకి
నవ్వుతూ ఉంటే
వసంతం పూలలోయలో నడిచినట్లుంటుంది

నేలకి పూచాయో, కాలానికి పూచాయో
పూలు, పూలు నా నడక ముందూ, వెనుకా

ఎండిన పుల్లేదో తగిలినట్లు
నా నవ్వుల మధ్య ఒక ఆలోచన తగులుతుంది

నా మొదటి క్షణాల్లో నేనూ ఇలా నవ్విన
మరపు వెనుకటి జ్ఞాపకం ఏదో
ఆనందాన్నో, విచారాన్నో కలిగిస్తుంది

బహుశా, పాపాయిలోనూ
పోగొట్టుకొన్న బొమ్మలాంటి
నా చిన్నప్పటి ప్రతిబింబాన్నే వెదుక్కొంటున్నాను

కనుకనే, ఎవరైనా 'పాపాయిపై నీకెంత ప్రేమా' అంటే
'ఆమె నాకు ఇంకా అపరిచిత
నేను ఆమెలో కనిపించే బాల్యాన్ని ప్రేమిస్తున్నాను'
అని చెప్పాలనిపిస్తుంది

*30.11.1996*

*ఆదివారం . ఆంధ్రభూమి దినపత్రిక 23.2.1997*

# ఒక కొత్త ఆకాశం

ఈ పాప ఆకాశంలో ఉందా,
ఆకాశం ఈ పాపలో ఉందా!
రెండూ నిజమేనేమో!

ఇంకా ఏ జ్ఞాపకాలూ మబ్బులు కట్టని
నిర్మలమైన ఆకాశమేదో
పాపలో ఉండి వుంటుంది

ఏటి నురగలా
తనలోపలి ఆకాశంలో తానే తేలుతుందేమో
పాప మంచం మీద ఉన్నా
ఆకాశంలో ఉన్నట్లుంటుంది

పిట్టలా రెక్కలూపి గిరికీలు కొట్టే పాపకి
కిందా, పైనా ఆకాశమే!

పాప నా చేతుల్లో కేరింతలు కొడితే
భూమిలో వేళ్ళు పాతుకొని
నింగిలోకి కొమ్మలు చాపిన చెట్టులా
ఎగిరే పిట్టని చూస్తూ
అసహాయంగానూ, ఆనందంగానూ
నిలబడిపోతాను

*11.12.1996*

సాహితి . ఆంధ్రభూమి దినపత్రిక *6.1.1997*

# విషాదపర్వం

మనిషిగా పుట్టి
మనిషిగా చనిపోతూ వుండటం విషాదం

ఎన్ని శ్వాసలు తీసుకొన్నా
లోపల ఏ జ్వాలా రేగక పోవటం విషాదం

రోజు నాలుగుదిక్కులకీ పల్చని అలవాట్లు అల్లుకొని
సాలెపురుగై బ్రతకటం విషాదం
కలకీ, కర్తవ్యానికీ మధ్య బద్దకం చెదలు వ్యాపించటం విషాదం

గెలుపూ, ఓటమి మినహా జీవితం లేకపోవటం విషాదం
గెలుపుని ఆరాధిస్తూ ఓడిన కళ్ళూ వికసించటం విషాదం

సాహసం లేకపోవటం
సాహసించే సందర్భం లేకపోవటం విషాదం
సాహసి తనని తాను జయించలేకపోవటం విషాదం

బాధ లేకపోవటం
బాధ భరించలేకపోవటం విషాదం
లోతైన బాధల్లేని నునుపైన బ్రతుకు విషాదం
శరీర సుఖం చివరి మజిలీ కావటం విషాదం

బ్రతుకు ప్రశ్న కావటం
ప్రశ్న కాకపోవటం విషాదం
ప్రశ్నల పాదాల మధ్య
ఎక్కే మెట్లులాంటి
ఎదిగే మౌనం లేకపోవటం విషాదం

మనిషిగా చనిపోయే ప్రతిసారీ
పాతమనిషే తిరిగి పుట్టటం విషాదం

*23.12.1996*
*సాహిత్యనేత్రం సంచిక : 8*

# అంకురం

పాపాయి గుర్తుపడుతోంది

ఆమె మేథాబీజం
తొలి జ్ఞాపకాల చిగుర్లు విప్పుతోంది

ఇక ఆమె మనస్సు క్రమంగా
నిన్నూ, నన్నూ, మనల్నీ
రంగుల్నీ, నీడల్నీ

మాటల రంగుల్నీ, నీడల్నీ
చూపుల రంగుల్నీ, నీడల్నీ

గుర్తుపడుతూ, గుర్తుంచుకొంటూ
శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది

ఇక ఈ మొక్క
ఏ పూలు పూస్తుందో
ఏ ఫలాల నిస్తుందో
ఏ నీడల నిస్తుందో

ఎదురుచూడాలి
ఎదురుచూడాలి

*8.1.1997*
*ఆంధ్రజ్యోతి వారపత్రిక 21.2.1997*

# పేర్లు

‘పాపని ఏమని పిలుస్తావ’ని అడిగారెవరో

ఏమని చెప్పాలి?
ఏ రెండు పూలనీ
ఒకే పేరుతో గుర్తించటం ఇష్టం లేనివాడిని
ఏ రెండు క్షణాల పాపల్నీ
ఒకే పేరుతో ఎలా పిలవను?

నేను అన్నాను
‘చినుకునుండి సముద్రానికీ
సముద్రంనుండి చినుకుకీ
నీటికెన్ని పేర్లో
పాలనవ్వుల నుండి కంటతడికీ
కంటితడి నుండి పాలనవ్వులకీ
పాపాయికి అన్ని పేర్లు’

*9.1.1997*

# రాత్రిని పలుకరిస్తూ

హాస్పిటల్ లో దీపాల వెలుతురు
బయట నక్షత్రాలు కురిసే చీకటి
చీకటికీ, వెలుతురికీ మధ్య ఆమె

వెలుతురు కింది అక్కడక్కడి నీడల్నీ
చీకటి కింది అక్కడక్కడి వెలుతుర్లనీ చూస్తూ
నిద్రకీ, మెలకువకీ మధ్య ఆమె

రోగానికీ, ఆరోగ్యానికీ మధ్య
జీవితానికీ, మృత్యువుకీ మధ్య రోగులు
వారితో మాటలకీ, మౌనానికీ మధ్య ఆమె

అప్పుడప్పుడూ ఎవరో ఒకరు
ఎడారి నిశ్శబ్దంలో
అడుగులచప్పుడు ముద్రిస్తూ వెళిపోతారు

ఎవరో ఒకరు
ఆమె మౌనతీరం మీదికి
అలలాంటి మాటల్ని విడిచిపెడతారు
అల వెళ్ళిపోయాక
మాటలు నెమ్మదిగా మౌనంలోకి ఇంకిపోతాయి

అప్పుడప్పుడూ ఫోను మ్రోగిన చప్పుడు
ఎండిపోతున్న మెలకువ చుట్టూ
లతలా పచ్చగా చుట్టుకొంటుంది

మరలా
రేపటికీ, నిన్నటికీ మధ్య కూర్చుని
తెగనీ, సాగనీ ఆలోచనల తీగెలపై
చీకటిని మీటుతుంది

ఏ పత్రిక పుటలనో
కనురెప్పల్లా మూస్తూ, తెరుస్తూ
తూర్పూ, ఆమె కనులూ
ఎర్రబడే వరకూ ఎదురుచూస్తుంది

*9.1.1997 రాత్రి 1.00*
*చైతన్యకవిత : 38 & 39*

# కల ఒక నిజం

కలలు కలలే
కలలకి రక్త, మాంసాలుండవు

నిజంలాంటి  చలించని భూతీరాన్ని
కలలు అలల్లా చరుస్తూ వుంటాయి
భూమి కదలదు. సముద్రం వదలదు

కలల సముద్రంలో పడి
ఏ స్వర్ణోదయాలవైపుకో ఈదుకొంటూ పోతానా
నిజం ఒంటికన్నుతో
దీపస్తంభమై నా కోసం చూస్తూనే వుంటుంది

కలలు నన్ను నడవనిస్తాయి
కలలు నన్ను నడవనియ్యవు

అయినా కలని ప్రేమిస్తాను
కలని ఒక నిజంలా ప్రేమిస్తాను

కల కుడి, ఎడమలు మార్చుకొన్న నిజంలా వుంటుంది
ప్రతిబింబానికి రక్తమాంసాలుండవు

రక్తమాంసాలలో కలలు సంచరిస్తాయి
నిలువెత్తు కలలో రక్తమాంసాలు ప్రవహిస్తాయి

కలకి అనువాదం నిజమా?
నిజానికి అనువాదం కలా? తెలీదు

కల విషాదం కాదు. నిజం విషాదం కాదు
విషాదమంతా అనువాదమే

నేనెవరో తెలీదు
కలనో, నిజాన్నో, అనువాదాన్నో తెలీదు
కలకీ తెలీదు నేనెవరో

తెలియకుండా పుడతాం కదా
ఏమీ తెలియకుండానే మరణిస్తాం

. . .

ఇప్పుడు సూర్యుడూ లేదా నక్షత్రాలు
తరువాత
అంతా ఒకే మహా మౌనం

*25.2.1997*

ఆంధ్రజ్యోతి వారపత్రిక *28.3.1997*

# కొవ్వొత్తి

గది అంతా కాంతి నిచ్చే ఈ జ్వాలకి
చిక్కని కాంతి చర్మం ఒక సరిహద్దు

విత్తనంలాంటి వత్తిని
పారదర్శకంగా దాచుకొంది ఈ కాంతిద్రాక్ష

వణికివణికీ కదలని కాంతి ఏ చలికి గడ్డకట్టింది

ఇంతలో రూపాంతరమై
జారుతున్న చినుకులా మృదువుగా మొనతేలింది

ఏ పిల్లాడు చెక్కాడు
ఈ కాంతిముల్లును ఇంత సూటిగా

ఈ కొవ్వొత్తికి పొడవునా నీడ ఉంది కాని
నీడకి కాంతిరేఖ లేదు

ఆర్పివేశాక చూస్తే
కొవ్వొత్తి టేబుల్ మీద ఉండిపోయింది
నీడని వెంటబెట్టుకొని కాంతి ఎటో వెళ్ళిపోయింది

*4.3.1997*

ఆంధ్రజ్యోతి వారపత్రిక *30.5.1997*

# ఎండుటాకుల మీద నడక

పక్క కుదరదు. కలలు పట్టవు
రెప్పలకింద సూర్యబింబం మెరమెరలాడుతుంది

ప్లాస్టిక్ పూలని తాకి గాలి గాయపడుతుంది
నాగరికుడు వాడిపోడు. వికసించనూ లేడు

సంభాషణలో కొత్తవాక్యం, పదం లేదా ఉచ్చారణ
నవ్వే చూపు రెక్క ముడిచి ఆలోచనపై వాలుతుంది

కొయ్యస్పర్శ లూ, కొయ్యమాటలూ
కొయ్యబారిన చెట్లకి పూలు పూయవు

నమ్మకాల బుడగలకి సూది స్పర్శ
కలలరంగులు ముడుచుకుపోతాయి

కన్నీరు రాని దుఃఖం, కోపం రాని దుఃఖం
కెరటాన్ని మడిచి లోయలోకి విసురుకొన్న దుఃఖం

ఏ కారణమూ, ఏ ఉద్వేగమూ శాశ్వతంగా ఆదుకోవు
దొరికిన శబ్దాలు పట్టుకొని ఎటో ఈదుతుంటాం

*22.3.1997*

ఆదివారం . ఆంధ్రజ్యోతి దినపత్రిక *13.7.1997*

## నదిని చూసి

తెల్లవారుతోంది
రైల్లోంచి గోదావరి కనిపించింది
మబ్బులు ఇవాళ ప్రయాణమెటో ఇంకా తేల్చుకోలేదు
పగటి మసక వెలుగులో
ఇసుకతిన్నెలూ, తెరచాపలూ
ఉల్లాసకరమైన మగతలో  ఊగుతున్నాయి

ఒడిలోని మా అమ్మాయితో
'అమ్మా, గోదావరి రా' అన్నాను
ఏదో చెప్పబోయి మాటలు తెలీక
మా అమ్మాయి చేసే చప్పుడు నా లోపల

గోదావరి గురించి ఏం చెప్పను?

ఈ నేల పచ్చదనంలోకీ, పూలలోకీ
ప్రవహిస్తూంది ఈ నీరు
పూలమీద ఎగరేస్తుంది సీతాకోకల్ని
వెచ్చగా మాలోకి ప్రవహించి
మాలో ఆకాశాన్ని ప్రతిఫలిస్తుంది

ఈ నీరే లేక కదా
ఎండిన నేలల మీద
వెన్నెల కూడా పొడిగా రాలుతోంది

ఏం అర్థమయిందో
పాప గోదావరిని కన్నార్పకుండా చూసింది
పాప కనుపాపలో గోదావరి ప్రవహించింది

పాప, నాన్నలా కవిత్వం రాస్తుందా అనుకొనేవాడిని
రాస్తుందో, లేదో
ఆమె నదిని ప్రేమిస్తోంది
నిండారా ప్రవహించే నదిని
అంతకన్నా ఏం కావాలి?

*1.8.1997*

*ఆదివారం . ఆంధ్రభూమి దినపత్రిక 28.12.1997*

# నిరీక్షిస్తూ

నీకోసం ఎదురుచూస్తాను
కలుసుకొంటే ఏముందీ!
ఇద్దరు మానవులూ, ఒక సంభాషణా

ఊరికే కలిసే సరదాకి
ఒకరినొకరు వెదికితే
విస్మయం చెందే రోజులలో
ఎదురుచూపు అంతకన్నా విస్మయకరమూ
అందమైన సంగతీ

ఎండిపోతున్న చెట్లకి పూచే
చివరి రెండు పూలలా
మాటలకో, మౌనానికో
మనం వికసించే తొందర

నిరీక్షణ
నాలోని ప్రాచీనకాలాల మానవ పరిమళాన్ని
మేల్కొలుపుతూ వుంటుంది

బయటి శూన్యం నించి ముడుచుకొంటూ
నేను నీకోసం
నాలోపలి సమస్తం తెరచి వెదుకుతాను

తీరా నువ్వు వచ్చేసరికి
నేను నా లోపలెక్కడో వుంటాను

బహుశా
అది మనం ఎప్పుడూ కలిసివుండే చోటు
అంతే కదూ!

*17.8.1997*
ఆంధ్రజ్యోతి వారపత్రిక *19.9.1997*

# అస్తిత్వానికి అటూ, ఇటూ

కలనించి మేలుకొన్నట్టు
మెలకువ నించీ మేలుకోవాలనిపిస్తుంది

ఇంత జీవించే రొదలోనూ
ఏదో నిశ్శబ్దం వెంటాడుతుంది

లోతైన నీటిలోకి ఎండ మృదువుగా అంతరిస్తుంది
ఈ కాంతి కింద నాలోకి ఒలికిన అనుభవాలు మాత్రం
జ్ఞాపకాలుగా ఘనీభవిస్తాయి

ఒకపాట ఏదో క్రమంగా వికసిస్తూ వుంటుంది
గడచిపోయిన కల ఎంతకీ కరగదు
మర్యాదలూ, సంస్కారమూ ఉట్టిపడే
చెట్టు బెరడవుతుంది ముఖం

ఎగసిపడే జీవజ్వాలని ఎలా అదిమిపెట్టాలి?
పగటికలలు సరిపోవు
పలుచని కలలు జీవనానందాన్ని మోయలేవు

నిజమైన ఆకాశం కింద
ఒక అభివ్యక్తి విస్తరిస్తూ పోవాలి

ఈ అస్తిత్వపు రాయినెవరో విసిరారు కాలం కొలనులోకి
నా అలలారా బద్ధకించకండి

వేలమైళ్ళ పొడవైన కాంతిని మోశాక
నా స్థలం ఖాళీ చేయాలి
ఒక గడ్డిపువ్వు కోసం లేదా వానచినుకు కోసం

అప్పుడిక ఎవరి అడుగుల చప్పుడూ వినిపించని ఏకాంతం
నన్ను స్వీకరిస్తుంది

*18.8.1997 రాత్రి 2.25*

# చివరిపూలు

పూలనీ, పూల జ్ఞాపకాలనీ
కాలానికి అలంకరించిన మొక్కలు
ఎండిపోయినట్టున్నాయి

ఇపుడే
ఏ నిప్పుకణమో
పుప్పొడిలా ఎగిరి వచ్చి
ఎండిన కొమ్మల్ని తాకినట్లుంది

జ్వాలల పూలరేకుల్తో
కొమ్మలు వికసిస్తున్నాయి చివరిసారి

మృదువైన రంగుల కాంతులు
కొమ్మల్లోంచి
చరచరా వెళ్ళిపోతున్నాయి

ఇక
సంధ్యకాంతులు వెళ్ళిపోయాక
ఆకాశం నల్లబడినట్లు
దగ్ధమైన కొమ్మలు
విరిగిపడిన రాత్రి శకలాల్లా
నల్లగా మిగులుతాయి

*20.10.1997*

# మహా వైఫల్యం

విఫలమైన కాంతి రంగులుగా కనిపిస్తుంది

అన్నీ అంతే
సత్యం నుంచి వైఫల్యమే
జీవితం, ప్రపంచం, పాలపుంతలు

నా కవిత్వమూ అలాగే ఉండాలని
ఒక మహా నిశ్శబ్దం వైఫల్యంగా

జల జలా మాటలు కాదు
మహా నిశ్శబ్దాన్ని అదిమి పట్టుకొన్న
ఒక్కొక్క అక్షరం కావాలి

ఇంత ప్రపంచం
ఇన్ని అనుభవాలూ అక్కర్లేదు
చాలావరకూ చెరిపేయవచ్చును

ఓ మంచు కణం..
ఓ తృణం..
ఓ నేను..
అది కూడా
క్రమంగా చెరిగిపోవచ్చును

*30.10.1997*

# పిల్లల లోకం

ఏ లోకం నుంచి వస్తారో ఈ పిల్లలు
ఈ కొత్త ప్రపంచాన్ని తేరిపార చూస్తారు

అక్కడ వాళ్ళు సంగీతంలో సంభాషిస్తారేమో
మన ఎదగని భాషని వాళ్ళ సంగీతంలోకి అనువదించుకొంటారు

వాళ్ళ లోకంలో జీవించటమంటే నర్తించటమేమో
ఇక్కడ కూడా అల్లరి లయబద్దంగా చేస్తారు

మొక్కలూ, పిల్లలూ కలిసి ఆడుకొనే లోకమేమో అది
ఇక్కడ నవ్వుతారా, నిద్రిస్తారా, ఏడుస్తారా
అన్నీ పూలు పూస్తున్నట్టో, రాలుతున్నట్టో ఉంటాయి
తాము చేసేవి తమకు తెలీదు మొక్కలకు లాగే

ఏ లోకమో ఈ పిల్లలది
అక్కడ కాలం వుండివుండదు
ఆనందం తరువాత ఆనందమే కాని క్షణాల లెక్క తెలీదు

వాళ్ళ కలలూ, జ్ఞాపకాలూ
నీటి మీది బుడగలలా ఎటో కొట్టుకుపోయినా పట్టించుకోరు

పిల్లలకి పుట్టామని తెలీదు, చనిపోతారని తెలీదు
అవి లేని లోకం నుండి వచ్చారేమో, అవి వాళ్లకి అర్థం కావు

శరీరాలు అక్కర్లేని ఏ లోకం నుండి వచ్చారో
ఇక్కడ దోబూచి ఆడతారు
అదృశ్యమయ్యే లోకాలు మనకు అందవు కదా
కళ్ళు తెరిచి ఫకాలున నవ్వుతారు

పిల్లలకి చీకటి భయం, నిశ్శబ్దం భయం
అవి లేని కాంతి నించి వచ్చి ఉంటారు
శబ్దం నించి వచ్చి ఉంటారు

పిల్లలు తపతపా అడుగులేస్తూ
మన లోకం లోకి నడుస్తూ ఉంటారు
వాళ్ళ అడుగులలో చివరిసారి ప్రతిఫలిస్తూ
ఆ లోకపు సౌందర్యం అదృశ్యమౌతుంది

వాళ్ళ చేతులు పట్టుకొని నడక నేర్పుతామా
ఎప్పుడైనా వాళ్ళిటు రావటం మాని
మననే అటు తీసుకుపోతే బాగుండునని ఎదురుచూస్తాము

*2.11.1997 రాత్రి 2.00*
*ఆంధ్రప్రభ వారపత్రిక 23.11.1998*

# పాపా - సీతాకోకా

రంగురంగుల పూసలతో అల్లిన
సీతాకోకతో ఆడుకొని
పాప నిద్రపోయింది

నిద్రలో పాప పెదాలమీద
ఒక నవ్వు సీతాకోకలా
రెక్కలు విప్పి ఎగిరిపోయింది

ఇప్పుడు పాప కలలో
పూసల సీతాకోక
ఎగురుతూ వుండివుంటుంది!

కలలు తేలిక కదా!
తేలికైన కలలో
సీతాకోకా, పాపా కూడా ఎగురుతారు

కొంతసేపు ఆడుకొన్నాక
సీతాకోక నిశ్శబ్దంలోకి ఎగిరిపోతుంది

సీతాకోక వెనుకే
కల కూడా ఎగిరిపోతుంది

పాప కూడా వాటి వెనుకే
తనలోని శూన్యంలోకి వెళ్ళిపోతుంది

*20.11.1997*

ఆదివారం . వార్త దినపత్రిక *21.12.1997*

# వేసవికల

వేసవి ఆకాశంలో సూర్యుడు నీటి విత్తనాలు నాటుతాడు
ఇక లేత మబ్బులు మొలిచి
శాఖోపశాఖలుగా గుబురులెత్తి చిక్కబడతాయి

గాలిలో వేర్లు నాటిన మబ్బులు
గాలివెంటే తిరుగుతుంటాయి
మబ్బుకింద పరిగెత్తే నీడ
కదలని చెట్ల నీడల్ని చెరిపేసి, గీచి వెళుతుంది

మబ్బులకీ శిశిరం వస్తుంది
ఆ రుతువుని మనం వర్షాకాలం అంటాము
గాలికి ఊగీ, ఊగీ మెరుపుకొమ్మల్ని రాచుకొంటూ
చినుకు చినుకుగా అవి పత్రాలు రాల్చుతాయి
చినుకులు వాటి పత్రాలు, పూలు, ఫలాలు

రాలిన చినుకుల కడుపులో
మబ్బుల విత్తనాలు ప్రతిఫలిస్తాయి

ఆకాశం నేర్పిన చెట్టు పాఠం
చినుకులిప్పుడు నేలమీద పాటిస్తాయి
కనుకనే, చినుకులు
మట్టిలో ఒక విత్తనాన్ని వెదకి, మృదువుగా నిద్రలేపి
మొక్క కావటం ఎలాగో నేర్పుతాయి

*2.4.1998*

*సాహిత్యవేదిక . ఆంధ్రజ్యోతి దినపత్రిక 29.6.199*

# ప్రేమలో

ఎవరెవరినో ప్రేమించాను
వారూ నన్ను ప్రేమించా రనుకొన్నాను
వారు నన్ను ప్రేమించలేదని
నా ప్రేమను ప్రేమించారని తెలిసినపుడు
నిరాశ కలిగింది

నిన్ను చూసాక తెలిసింది
నేనూ వారిని ప్రేమించలేదు
వారిని నువ్వనుకొని ప్రేమించానని

నిన్ను చూసాక తెలుస్తోంది
నేను నిన్నూ ప్రేమించటం లేదు
నీ రూపంలో ఉన్న నన్నే ప్రేమిస్తున్నానని

నిన్ను ప్రేమించాక తెలిసింది
నా లోపల ప్రేమతప్ప ఏమీలేదని

ఇప్పుడు
మానవులూ, వారి పొరపాట్లూ, దు:ఖాలూ, నవ్వులూ
పిట్టలూ, పూలూ, నక్షత్రాలూ
ఆకాశమూ, భూమీ, జీవితమూ
చివరికి మృత్యువు కూడా -

నా లోపల నువ్వు వెలిగించిన ప్రేమ కాంతిలో
ఎంతో అందంగా నిర్మలంగా గోచరిస్తున్నాయి

నేస్తం
నిన్ను ప్రేమించాక తెలుస్తోంది
నేను సమస్తాన్నీ ప్రేమించటానికి పుట్టానని

*25.3.1999 రాత్రి 12.30*
*చైతన్యకవిత సంచిక : 40*

# పరాజితుడు

మనిషి స్త్రీలని జయించాడు
వృద్ధుల్ని జయించాడు
పిల్లల్ని జయించాడు
దుర్బలులైన
మనుషుల్నీ, జాతుల్నీ, దేశాల్నీ జయించాడు

అహం అతని దౌర్బల్యం
అది అతన్ని జయించింది

మనిషి నేలని జయిస్తున్నాడు
సముద్రాన్ని జయిస్తున్నాడు
ఆకాశాన్ని జయిస్తున్నాడు

తనని తాను జయించని అతనికి
ప్రతి విజయమూ పరాజయమౌతోంది

మనిషి జననాన్ని జయిస్తాడు
బహుశా, మరణాన్నీ జయిస్తాడు

జ్ఞాపకాలనీ, కలల్నీ జయించని అతను
ఈ క్షణం ముందు ఓడిపోతూనే వుంటాడు

మనిషి సమస్తాన్నీ జయిస్తాడు
అతని కోరిక అతన్ని జయిస్తుంది

అతను రాల్చే పూలూ, అతను రాల్చే నక్షత్రాలూ
రాలుతూ అతన్ని చూసి జాలిగా నవ్వుతుంటాయి

*28.3.1999 రాత్రి 12.25*
*చైతన్యకవిత సంచిక : 40*

# శూన్యానికి ముందు

కాలం పొరలు చేదు అనుభవాలని కప్పివేస్తాయి
ఒక పదం లేదా ఒక రూపం
ఏదో ఒక ప్రతీక దు:ఖాన్ని మరలా తట్టిలేపుతుంది
లోపల ఒక మహాసముద్రమే మేలుకొంటుంది
మిత్రుడా, మరొకసారి జీవన్మరణాల సరిహద్దులు కంపిస్తాయి

లోలోపల ఎవరో సున్నితంగా నవ్వుతారు
'ఇంతటి నీ దు:ఖమూ కేవలం నటన,
నీముందు నువ్వే నటిస్తున్నావు' అని ఆ నవ్వు

. . .

నేను రెండు నేనులుగా వుంటాను
ఇది అంతా అణువుల సముదాయం
అణువుని చివరివరకూ విప్పిచూస్తే ఆద్యంతాలు లేని శూన్యం
నేనూ అణువుల సముదాయాన్నే
నన్ను చివరివరకూ విప్పి చూసినా ఆద్యంతాలు లేని శూన్యమే
దేహాణువుల లోని మానసిక అణువులలోని చరమశూన్యం నేను

ఏ వ్యక్తిత్వం సమగ్రం కాదు. ఏ అనుభవం సమగ్రం కాదు
ఏ నవ్వూ, ఏ విచారం సమగ్రం కాదు
అన్నిటిలోనూ వెలితి. అన్నిటిలోనూ నటన
చివరిశూన్యం దేనినీ పూర్ణంగా ఉండనీయదు

. . .

చిన్న గాలిసుడి క్రమంగా గాలి అలల్ని కదిలించి
సుడిగాలిగా మారుతుంది
నాలోపలి దు:ఖమూ అంతే. సంతోషమూ అంతే
చిన్న విచారరేఖ క్రమంగా మహాదు:ఖంగా బలపడుతుంది

ఎలాంటి పెనుగాలీ సమగ్రం కాదు
గాలివృత్తాలు పెరుగుతాయి. వాటి గర్భంలో శూన్యమూ వ్యాపిస్తుంది
మహాదు:ఖమూ అంతే. మహదానందమూ అంతే
వాటి వలయాలు బలపడతాయి. వాటిలో బోలుతనమూ విస్తరిస్తుంది

నటన తేలిపోతూనే వుంటుంది
శూన్యం చిరునవ్వుతో చూస్తూనే వుంటుంది

. . .

మనుషులు ఉల్లాసంగా ఎన్నిటిని సవాలు చేయలేదు?
దు:ఖంలో ఎన్ని ప్రశ్నలు వేయలేదు?
మిత్రుడా, సమాధుల్ని చూడు
అవి చరమశూన్యం ఇచ్చిన జవాబులు

*28.7.1999* రాత్రి *10.00*
ఆదివారం . వార్త దినపత్రిక *15.8.1999*

# కల వెలుపలి కల

దేనినో పోగొట్టుకొన్న బెంగ
ఎప్పుడూ నాలో నీడలా పరుచుకొని వుంటుంది

ఏది పోగొట్టుకొన్నానని?
ఎవరిని విడిచి వచ్చానని?
ఏ పరాయిచోట వున్నానని?

ఏదీ జ్ఞాపకం రాదు
బెంగ మాత్రం విస్తరిస్తూనే వుంటుంది

సందేహం లేదు
ఎక్కడో మోసపోయి వుంటాను
లేదా నన్ను నేనే మోసగించుకొని వుంటాను

బెంగ ఏమీ సరదా కాదు
చవకబారు సరదాలతో ఈ దిగులుని కప్పుకోనూ లేను
ఒక మోసం తప్పించుకొనేందుకు మరొకసారి మోసగించుకోలేను

రెండువైపులా మోసమే అనిపించాక
రెండువైపులా మృత్యువే కనిపించాక
ఇక వెనుకకు తిరగలేను

. . .

ఎవరో అంటున్నారు
నేను నన్నే పోగొట్టుకొన్నానని
నానుండే దూరమయ్యానని

వారు మాట్లాడుతూనే ‘ నేను మౌనాన్ని’ అన్నారు
కనిపిస్తూనే ‘ నేను శూన్యాన్ని’ అన్నారు

వారు అంటున్నారు ‘ నువ్వూ, నేనూ ఒకటే’ అని
ఎంత దృఢమైన ప్రేమ
మీరూ, నేనూ వేరు అనే బలహీన ప్రేమికుడిపైన!

వారు చెబుతున్నారు
‘ మిత్రమా! నువ్వులేవు. కదలికలేదు. సృష్టిలేదు
హాయిగా వుండు’ అని

వారి మాటలతో
నా బరువంతా ఒక్కసారి కలలాగా తేలిపోయింది

. . .

నిజమే కావచ్చును
జననం, జీవితం నేను కంటున్న కల కావచ్చును

సంతోషం, విచారం కల అయినప్పుడు
సంతోషంగా ఉండటం ఎంత తేలిక!

ఇవ్వటం, తీసుకోవటం కల అయినప్పుడు
ఇవ్వటం ఎంత తేలిక!

నేను ఉండటం, లేకపోవటం కల అయినప్పుడు
‘ నేను’ ఉండటం ఎంత తేలిక!
‘ నేను’ లేకపోవటం ఎంత తేలిక!!

*28.7.1999 రాత్రి 10.35*

# ఇంకా యుద్ధాలు చేస్తున్నాం

మొదటి మానవుడు భూమిమీద నడిచి
వేల తరాలు గడిచాయి

ఇవాళ మనిషి బలవంతుడు, తెలివైనవాడు
ఇప్పుడు మనిషికి సంస్కారం తెలుసు, ప్రేమ తెలుసు
అన్నిటికన్నా, మనిషికి తాను ఎవరో తెలుసు

అయినా ఆశ్చర్యం! విషాదం!
మనిషి యుద్ధాలు చేస్తూనే వున్నాడు
తనలాంటి మనుషుల్ని చంపగలుగుతున్నాడు
తన హత్యలకు సిగ్గుపడకుండా వున్నాడు

. . .

నేను మాట్లాడేది సైనికుడి గురించి కాదు
సైనికుడు మన ఇంటిలోని యువకుడు
అమ్మా నాన్నల్నీ, సహచరినీ
పిల్లల్నీ, సంతోషాలనీ, జీవితాన్నీ
మనకంటే బాగా ప్రేమించేవాడు

మనం యుద్ధం ఒక ఆట అంటే
నమ్మి అమాయకంగా వెళ్ళినవాడు
వెళ్లి తిరిగిరానివాడు

చనిపోయిన సైనికుడు శత్రువునే కాదు
తనవారినీ గెలుస్తాడు

భయం లేకుండా ఎలా బ్రతకాలో
త్యాగం అంటే ఏమిటో
అతను మరణాన్ని మన మీదికి గురిపెట్టి నేర్పుతాడు

శత్రువో, మనవాడో ఏ వీరుడు చనిపోయినా
ఒక తల్లి కన్నీరు కారుస్తుంది

ఆడుకొనేందుకు వెళ్ళిన పిల్లవాడు
ఆలస్యంగా తిరిగివస్తే తల్లి ఆందోళన అర్థమవుతుంది
' వస్తాను అమ్మా' అని నవ్వుతూ వెళ్ళిన పిల్లవాడు
చివరి చిరునవ్వుతో తిరిగివస్తే ఆమె ఏమవుతుంది?

ఆమె కళ్ళు మనని ప్రశ్నిస్తున్నాయి
బహుశా, మన ప్రాణం ఉన్నంత వరకూ ప్రశ్నిస్తూనే వుంటాయి

. . .

ఎవరు గెలిస్తే ఏమిటి?
యుద్ధం ఒక సామూహిక ఉన్మాదక్రీడ
యుద్ధం ఒక సామూహిక నేరం
మనలోపలి నేరస్తుడి ప్రతిబింబం యుద్ధం

ఎవరు సైనికుల్ని తయారుచేస్తున్నారు?
యుద్ధాల్ని రచిస్తున్న దెవరు?
ఏ భద్రజీవుల వినోదం యుద్ధం వెనుక దాగివుంది?

యుద్ధం ఎవరు గెలిస్తే ఏమిటి?
యుద్ధం మొదలైనప్పుడే
మానవుడిగా మనం ఓడిపోతున్నాం

మన బలం ముందు
మొండితనం ముందు
బాధ్యతా రాహిత్యం ముందు

మన తెలివి ఓడిపోతోంది
సంస్కారం ఓడిపోతోంది
ప్రేమ ఓడిపోతోంది

చనిపోయిన వీరుడికి
యుద్ధాలు లేని భవిష్యత్తుని హామీ ఇవ్వగలమా?

. . .

వీరుడు యుద్ధం శాంతి కోసం చేస్తాడు
ఉన్మాది యుద్ధం యుద్ధం కోసం చేస్తాడు
ఉన్మాది వీరుడు కాడు, వీరుడు ఉన్మాది కాలేడు

ఇండియా కార్గిల్ లో యుద్ధం చేయలేదు
యుద్ధం ఆపింది
ఈ దేశం ఇవాళ ఒక యుద్ధం నివారించింది

ఇది నా దేశం అనికాదు
ఒక యుద్ధం నిలిపిన దేశంగా
ఈ నేలకి, ఈ జాతికి, ఈ సంస్కృతికి నమస్కరిస్తాను

యుద్ధం కోసం కాదు, శాంతి కోసం
పూలు రాలినంత తేలికగా ప్రాణాలు విడిచేస్తున్నందుకు
ఇక్కడి వీరులకి నమస్కరిస్తాను

*29.7.1999*

చైతన్యకవిత

# నేనే ఈ క్షణం

గాలి బిగిసినట్టు లోపల ఏ కదలికా లేని క్షణం
ఒక కోరిక చినుకులా రాలుతుంది

చినుకులాగే కోరిక ఒంటరిగా రాదు
చినుకు చుట్టూ అనేక చినుకులు
కోరిక చుట్టూ అనేక కోరికలు

కోరిక ఒంటరిగా తీరదు
కోరినచోటికి అనేక కోరికల ద్వారాలు తెరిచివెళ్ళాలి

కోరికలని గమనించి చూసాను
తీరినవీ, ఎన్నటికీ తీరనివీ

తీరిన కోరికలు నా లోపల ఏ ముద్రా మిగల్చలేదు
వాటి అనుభవం గతంలోనే నిలిచిపోయింది
తీరిన కోరిక ఏదీ నశించనూ లేదు
ఇంకా బలమైన కోరికగా మరలా మొలకెత్తింది

తీరని కోరికలు నాలో అగ్నిపాదాలతో నడుస్తున్నాయి
అవి నన్ను భవిష్యత్తుకు నడిపిస్తున్నాయి

అనుభవం నుండి కోరికలోకి
గతం నుండి భవిష్యత్తులోకి తెంపులేని నడక

నడిచి నడిచీ విసుగు వచ్చినప్పుడు
నన్ను నేనే అడిగాను
ఏ కోరిక అయినా నీకు శాంతి నిస్తుందా?

మనస్సు మొదటిసారి తనలోకి చూసుకొంది
ఏ అనుభవం దానిలోకి ఇంకలేదు
ఏ అనుభవం దానికి స్పృహ లేని పారవశ్యం కలిగించలేదు

. . .

మనస్సు నా లోపలి శూన్యం
కోరికలు దానిలోంచి పుట్టాయి
విశ్వం తేలుతోంది నా వెలుపలి శూన్యంలో
విషయాలు దానిలో పుడుతున్నాయి

రెండు శూన్యాలు ఒకదానినొకటి ఏమీ చెయ్యలేవు
బహుశా, రెండూ ఒకే శూన్యానికి రెండు చివర్లు

రెండు శూన్యాలు తెలిసాక నన్ను నేను చూసుకొన్నాను
అవి లేవు. నేను మాత్రమే వున్నాను

గతం ఒక శూన్యం. భవిష్యత్తు మరొక శూన్యం
బహుశా, రెండూ ఒకే శూన్యానికి రెండు చివర్లు

నేను ఒక్క క్షణమైనా గతంలోకి వెళ్ళలేను
ఒక్క క్షణమైనా భవిష్యత్తులోకి వెళ్ళలేను
అవి ఎప్పుడూ లేవు. ఎప్పుడూ ఈ క్షణమే వుంది

. . .

ఇప్పుడు కోరిక తీరే స్థలం లేదు
నేనే వున్నాను
నేనే నా కోరికనై వున్నాను

ఇప్పుడు కోరిక తీరే కాలం లేదు
ఈ క్షణమే వుంది
ఈ క్షణమే నా అనుభవమై వుంది

ఇప్పుడు కోరిక లేదు
నేను మాత్రమే వున్నాను
ఈ క్షణం మాత్రమే వుంది

నేనే ఈ క్షణమై వున్నాను
ఎప్పటికీ నశించని క్షణం
ఏ మార్పూ లేని క్షణం
దేనినీ పొందని, కోల్పోని క్షణం

*30.7.1999 రాత్రి 2.00*
*సాహితి . ఆంధ్రభూమి దినపత్రిక 14.2.2000*

# మరొక మెలకువ కోసం

నాయకులని చూసి నేనొక నాయకుడిని కావాలనుకోలేదు

ప్రతి మనిషీ తన జీవితానికి తానే నాయకుడినని గ్రహించినపుడు
మానవులు అడుగుతారు
' మాకు లేని ఏ భయాన్ని సృష్టించి
మాకు నాయకుడిగా ముందు నడవాలనుకొంటున్నావు' అని

శాస్త్రవేత్తలను చూసి నేనొక శాస్త్రవేత్త కావాలనుకోలేదు

ఏ మొక్కల నుండో కొంచెం ఆహారం సేకరించి
మిగిలిన కాలం మానవులు సంతోషంగా గడుపుతున్నపుడు
వారు అడుగుతారు
' మాకు లేని ఏ బలహీనతలు కలిగించి
నీ ప్రయోగఫలాలు మా ముందు ఉంచాలనుకొంటున్నావు' అని

కవులను చూసి నేనొక కవిని కావాలనుకోలేదు

జీవనానందమే కవిత్వ రహస్యమని,
ప్రతి మనిషీ తానొక కావ్యాన్నని తెలుసుకొన్నపుడు
వారు అంటారు
' మా పాట మేం పాడుకొంటాం. మేమే మా పాటలమై ఉన్నాం.
ఇక నీ పాట వినే తీరిక లే'దని

ఏ మానవుని చూసీ, నేను అతనిలా కావాలనుకోలేదు.
నేను చూసిన ప్రతి మనిషీ ,
తాను మరొకలా, మరొకరిలా కావాలనుకొంటున్నాడు

కానీ,
పూలని చూసి నేనూ ఒక పూవు కావాలనుకొన్నాను

పూవుకి తననెవరో చూడాలన్న లక్ష్యం లేదు
మరొక పూవులా ఉండాలన్న కోరిక లేదు
సాయంత్రానికి రాలిపోతానన్న దిగులు లేదు
ఒక రంగులనవ్వులా వికసించి, నిశ్శబ్దంలో కలిసిపోతుంది

ఆకాశాన్ని చూసి, నేనూ ఆకాశాన్ని కావాలనుకొన్నాను

ఎన్ని రాత్రులు, పగళ్ళు వచ్చి, వెళ్ళినా
ఆకాశం కొంచెం కూడా చలించలేదు
మబ్బులూ, సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ
ఎన్నిసార్లు నడిచివెళ్ళినా దానికి ఏ మరకా కాలేదు
తెంపులేని ఆనందంలా ఆకాశం ఎప్పుడూ తెరుచుకొని ఉంటుంది

ఒక రాత్రి కలగన్నాను
కలలో నేను పూలనీ, ఆకాశాన్నీ చూసాను

మేలుకొన్నాక
అవి నాలోనివనీ,
అవి అన్నీ నేనే అయి ఉన్నాననీ తెలుసుకొన్నాను

ఇప్పుడు మేలుకొని పూలనీ, ఆకాశాన్నీ చూసి
ఇవి నాలోనివనీ, ఇవి అన్నీ నేనే అయి ఉన్నాననీ చెప్పే
మరొక మెలకువ కావాలనుకొంటున్నాను

*4.8.1999 రాత్రి 7.40*
*చైతన్యకవిత సంచిక : 38 & 39*

# ఆనందం

పూలూ, పక్షులూ, ఎడారులూ, సముద్రాలూ,
మబ్బులూ, సూర్యుళ్ళూ, నక్షత్ర సముదాయాలూ
ఎవరూ ఎరుగని ఏ శూన్యం నుండో
ఆనందాన్ని నీలోకి ఒంపుతున్నాయి
నీ జీవితం స్వయంగా ఆనందపు అభివ్యక్తి

దు:ఖం అనే నల్లటి ముసుగును మనపైన కప్పుకొని
కాలాన్ని గాఢాంధకారంగా చూస్తున్నపుడు కూడా
మనం ఆనందపు రూపంగానే వున్నాం

జీవనానందం అనే కాంతి మన కళ్ళని వెలిగించకపోతే
అంధకారాన్ని అయినా ఎలా చూడగలం

ఆనందించటం నీ హక్కు మాత్రమే కాదు, నీ బాధ్యత
కళ్ళులేకుండా మరొకరికి దారి ఎలా చూపటం
నీకు తెలీని ఆనందాన్ని మరొకరికి ఎలా ఇవ్వటం

ఆనందంగా ఉండే పనిలో
ఆనందంగా ఉండటమే విశ్రాంతి

ఆనందం దేనికీ ప్రతిచర్య కాదు
ఆనందానికి ఏదీ ప్రతిఫలమూ కాలేదు

మనం మాత్రమే ఆనందం పొందటంలేదు
ఆనందమూ మనని నిరంతరం పొందుతోంది

ఆనందమే ప్రేమ
ఆనందమే త్యాగం. సాహసం. స్వేచ్ఛ
ఆనందమే నిరంతర ముక్తబంధం

కారణాల సంకెళ్ళని ఆనందం తెంచుతోంది
మిత్రమా! అకారణంగా ఆనందించు
నువ్వు ఎవరూ ఎరుగని ఏకాంతపు ఆనందానివి

*8.9.1999 సాయంత్రం 6.10*

# మహిమ

తనని మాత్రమే ప్రేమించే మనిషి కలగంటాడు
ఏదైనా మహిమ వలన
తన జీవితం ఇంకా కాంతివంతం కావాలని

అతనికి ధనం ఒక మహిమ
అధికారం ఒక మహిమ
కీర్తి ఒక మహిమ

మానవాళిని ప్రేమించే మనిషి కలగంటాడు
ఏదైనా మహిమ వలన
మానవ జీవితం మరింత కాంతివంతం కావాలని

అతనికి యుద్ధం ఒక మహిమ
విప్లవం ఒక మహిమ
సంస్కరణ ఒక మహిమ

సమస్తాన్నీ ప్రేమించే మనిషి కలగంటాడు
ఏదైనా మహిమ జరిగి
సమస్త జీవితం మరింత కాంతిమయం కావాలని

అతనికి దైవం ఒక మహిమ
శాస్త్రం ఒక మహిమ
భవిష్యత్తు ఒక మహిమ

అయితే
సరిహద్దులు తెలియరాని విశాలవిశ్వం కన్నా మహిమ ఏముంది?
భూమి మీది నేలకన్నా, సముద్రం కన్నా, ఆకాశం కన్నా మహిమ ఏముంది?
ఇక్కడి ప్రాణం కన్నా, ఇంద్రియాల కన్నా, మనస్సు కన్నా
మనస్సులో సమస్తం ప్రతిఫలించటం కన్నా మహిమ ఏముంది?

జన్మించటం, జీవించటం, వెళ్ళిపోవటం కన్నా మహిమలు ఏముంటాయి?

మిత్రుడా, ఆద్యంతాలు తెలియని కాలం ఒక మహిమా ప్రవాహం
పూలనించి గెలాక్సీల వరకూ చలనం నిరంతర మహిమా ఆవిష్కారం
చలించేందుకు సమస్తం ఉండటం కన్నా మహిమ ఏముంటుంది?

మిత్రుడా! అస్తిత్వాన్నీ, చలనాన్నీ తెలిసికొంటున్న నీవు వుండటం కన్నా
మహిమ ఏది?
అపురూపం ఏది?
సున్నితమైంది ఏది?

*18.9.1999 రాత్రి 3.15*
*చైతన్యకవిత సంచిక : 34 & 35*

# పిల్లలకి ఒక ఉత్తరం

పిల్లల్లారా! పిల్లల్లారా!
నా చిన్ననాటి స్నేహితులారా!
మీతో మాట్లాడాలని వుంది
మీ సెలయేళ్ల ఆటల్ని కాసేపు తటాకంలా నిలిపి
కలువల్లా కూర్చొని నా మాటలు వింటారా?

అనగనగా ఊహకి అందని కాలం నుండీ
ఈ నేలని నాన్నలే పాలిస్తున్నారు
మనిషి కథ అంటే నాన్నల కథే అన్నారు
అందుకే ఈ కథ నిండా మొరటుదనమే వుంటుంది

ఇది అమ్మల కథ అయితే మృదువుగా, దయగా వుండేది
మీ కథే అయితే స్వర్గం కథ అయ్యేది
కానీ, ఇది నాన్నల కథ మాత్రమే కాదు
చాలాసార్లు తాతల కథ కూడా అయింది

పిల్లల్లారా! ఇప్పటి నుండైనా ఇది మీ సంతోషాల కథ కావాలి
సంతోషంగా ఉండేందుకు కావలసింది
సంతోషంగా ఉండటం మాత్రమే అని మీరైనా వీళ్ళకు చెప్పాలి

మనం కొత్త పుస్తకాలు తయారుచేయాలి
వాటిపై మనం కొత్త కథలు రాయాలి

ఆ పుస్తకాల నిండా కేవలం జీవితమే వుంటుంది
జీవితం అంటే సంతోషం అని అర్థం

పుస్తకాలలో మనం
ఎలా పాడాలో, ఆడాలో, ఎలా మాట్లాడాలో రాసుకొందాం
ఎలా చూడాలి, వినాలి, రుచి చూడాలి
సంతోషంగా ఎలా వుండాలి
ఎలా హాయిగా శ్వాసించాలీ చెప్పుకొందాం

పిల్లలూ! ఏది చూస్తే దానిగా
ఏది ఆలోచిస్తే దానిగా మనం మారిపోయే
జీవితం అనే అద్భుతమైన ఆటలో
మనం ఇంద్రధనస్సులనీ, పువ్వులనీ, సెలయేళ్లనీ ఆశ్చర్యంతో చూద్దాం!
సాహసమూ, త్యాగమూ, స్వచ్ఛతా, స్వేచ్ఛా స్పష్టంగా ఆలోచిద్దాం!

పిల్లల్లారా! మనం ఒకనాటికి ఈ నేలని ఇంద్రధనస్సుల కథగా మారుద్దామా!

*17.10.1999* పగలు *10.50*
చైతన్యకవిత సంచిక *: 34 & 35*

# రహస్యంలోకి

ఈ క్షణం
పగటి లోపలి పొరల్లో రాత్రి దాగి వుంది
మెలకువ లోపలి పొరల్లో నిద్ర దాగి వుంది
అనుభూతి లోపలి పొరల్లో ఆనందం దాగి వుంది
జీవితం లోపలి పొరల్లో అనంతం దాగి వుంది

ఈ క్షణమే
పగటి చివర్లు రాత్రిలోకి విస్తరిస్తున్నాయి
మెలకువ చివర్లు నిద్రలోకి విస్తరిస్తున్నాయి
అనుభూతి చివర్లు ఆనందంలోకి విస్తరిస్తున్నాయి
జీవితం చివర్లు అనంతంలోకి విస్తరిస్తున్నాయి

*21.10.1999 రాత్రి 8.00*
*చైతన్యకవిత సంచిక 34 & 35*

# వెన్నెలకవిత

ఎవరివో ఇరుకిరుకు జ్ఞాపకాలు కలతపెడతాయి
నిద్ర రాదు
గది తలుపులు తెరిచి ఆకాశం కిందికి వెళతాను

శరత్కాలపు రాత్రి
తెల్లని పల్చటి మేఘాలు చంద్రుడిపైన తేలుతున్నాయి

తెలియని ఏ లోకాలనుండి వర్షించాయో
పని ముగిసిన సంతోషంలో
ఎక్కడో వున్న స్వంతసీమకు వెళ్ళిపోతున్నాయి

తెల్లటి పూలరేకులా చందమామ!
తెలీని లోకాలలో వానకి రాలివుంటుంది!
దారితప్పి మేఘాలలో రాలి వచ్చి వుంటుంది!

చెదిరి ఆకాశమంతా పరుచుకొన్న
పూలపుప్పొడి నక్షత్రాలు!

నా జ్ఞాపకాలూ ఎటో చెదిరిపోయాయి
నన్ను కలతపెట్టి
నా కనుపాపల్ని ఈ రాత్రిలోకి ఆవిష్కరించిన
జ్ఞాపకాలలోని ఆప్తులకి ధన్యవాదాలు

విసుగులేకుండా, దయగా
చందమామ ఎంత వెన్నెల కురుస్తోందీ!

వెన్నెలలో ఎటో వెళ్ళిన కాలం
మళ్ళీ నాలో ప్రవేశించింది

కానీ, నేను వెన్నెలలో వున్నానో
వెన్నెలంతా నాలోపల వుందో తెలియలేదు!

గదిలోకి వచ్చి పక్కమీద పడుకొన్నాక గమనించాను
నా స్థలంలో నేను లేను!
వెన్నెల వుంది!!

*25.10.1999 రాత్రి 12.40*

# అద్దంలో పాపాయి

పాపాయి
అద్దంలో పాపాయిని చూపించి
పాప అంటూ పరిచయం చేస్తోంది!

పాప అమాయకత్వం
నాకు ఎలా వస్తుంది?!

అది సరే
ఇప్పుడు నేను
ఎవరి తరఫున ఎవరిని
పరిచయం చేసుకోవాలి?!

*30.12.1999 రాత్రి 12.25*

# నల్లనికాంతి

ఆకాశం నల్లబడింది
చెట్లూ, చెరువూ,
చెరువులో చెట్ల నీడలూ నల్లబడ్డాయి

నన్ను చూసుకొన్నాను
నేనూ నల్లబడ్డాను

ఈ నలుపులో
ఇంకా కరగని మసక వెలుతురు చూసాక
నాకు అర్థమైంది

వెలుతురు మమ్మల్ని రంగులుగా వేరుచేస్తోంది
నీడల సరిహద్దులు మా చుట్టూ గీస్తోంది

కొంతసేపటికి కాంతి పుష్పం చివరిరేకూ రాలిపోయింది
ఇపుడు నల్లనికాంతి అంతటా ఆవరించింది
చరమశాంతి లాంటి పరమశాంతి పూర్తిగా అవతరించింది

ఇప్పుడు
ఏది ఆకాశం? ఏది చెట్టు? ఏది చెరువు? ఏది నేను?!
ఎంత స్వేచ్ఛగా వుంది!

ఈ మాటలు కూడా
చీకటి తనలో తాను మాట్లాడుకొంటున్నట్లుంది!!

*30.12.1999 రాత్రి 12.50*

# చివరిస్మృతిలోనికి

కోరికల భ్రమరధ్వనులు మౌనానికి దూరం చేస్తాయి
బాంధవ్యాలు బంధాలుగా తెలిసివస్తాయి

నీ అస్తిత్వపు ఎరుక సమస్తం నుండీ నిన్ను వేరు చేస్తుంది
వేరుగా ఉండటం భయాన్ని కలిగిస్తుంది. బాధ కలిగిస్తుంది

మిత్రమా, అయినా దిగులు ఎందుకు?
~~ఈ~~ జీవనకుసుమం రాలిపోయే హామీ వెంటబెట్టుకొని వచ్చింది

ఎలా అయినా జీవించు
కాలం ఇంకా ఆవిష్కరించని రహస్యపొరలలో
ఒక సూర్యోదయం నీ కోసం వేచివుంది
ఆనాటి సూర్యుడు నీకు సంపూర్ణ స్వేచ్ఛ ప్రసాదిస్తాడు

పూలరంగులు, ఆకాశకాంతులు,
ప్రవాహాలూ, ప్రతిబింబాలూ, చిరునవ్వులూ
వీని పొరలలో నుండి మెరిసి మాయమయే సౌందర్యం
రూపాలు అందుకోలేని చోటున వుండి
ఆ రోజున నిన్ను తనలో కరిగించుకొంటుంది

అపుడు ఇక నిన్ను ఏ శబ్దాలూ కలతపెట్టవు
ఏ రూపాలూ కలవరపరచవు

మిత్రమా, దు:ఖం ఎందుకు?
నువ్వు కోరిన దానికన్నా ఎక్కువ నువ్వు అక్కడ పొందుతావు

ఇలాంటి జీవితం ఎంత కాలం జీవిస్తే నష్టమేమిటి,
కాలం చేరలేని గమ్యం నీకు హామీగా ఉన్నప్పుడు?

నీలో ఎన్ని చిన్నారి ఊహల సీతాకోకల్ని ఎగరేస్తే ఏమిటి?
ఏవేవో గాలులకి ఎన్ని సీతాకోకల రెక్కలు రాలితే ఏమిటి?

నీలో నువ్వు ఊహించినట్టే, కలగన్నట్టే
ఏదో ఆద్యంతాలు లేని ప్రేమ
తనలో నిన్నూ ఊహిస్తూ వుంది, కలగంటూ వుంది

ఆ అనంతంలోనే నువ్వు ప్రారంభమయావు,
కరిగిపోతావు కూడా

మిత్రమా, ఎందుకు భయం?

నువ్వు ఊహించలేనిది, నిను ఊహిస్తూ వుంది
నీ కోరిక కాలేనిది నిను ఆవిష్కరించు కొంటూ వుంది
నీ చలనాలకి కదలనిది నిను చలింపచేస్తూ వుంది
అది నిన్ను భద్రంగా పొదివిపట్టుకొంది

నీపై ఈ చీకటివెలుతురుల ఆట ముగిసాక
ఈ చీకటి అవతలి కాంతి
నిన్ను నిన్నుగా తిరిగి స్వీకరిస్తుంది

*30.1.2000 రాత్రి 8.15*

# వేసవి వర్షాన్ని

నేను వేసవికాలపు వర్షంలాంటి వాడిని
ఉక్కగా, దిగులుగా ఉన్న వాతావరణంలో
ప్రవేశించటమే నాకు ఇష్టం

చురుకుగా, చల్లగా నాలుగు చినుకుల్ని కురిసి
మీ ఎప్పటి శూన్యాకాశాన్నే మిగిల్చి మాయమైపోతాను

అనుకోని అతిథిలా అకస్మాత్తుగా వచ్చి
పూర్తిగా పరిచయం కాకుండానే
వెళ్ళిపోవటం నాకు ఇష్టం

అయితే, వేసవివాన తరువాత
కొందరికి జ్వరాలు వస్తాయి
జ్వరమంటే
పాత శరీరాన్ని దగ్ధం చేసుకొని
కొత్త శరీరంలో ప్రవేశించటమే

అలాగే, నేను వచ్చి, వెళ్ళాక
మీ పాత మనసులు దగ్ధమై
మీలో కొత్త మనసు ప్రకాశించాలని కోరుకొంటాను

*18.4.2000 రాత్రి 10.30*
ప్రకృతి సాహితి ప్రత్యేక సంచిక

# పాప ఇచ్చిన ఆకాశం

గదిలో నేను ఎప్పటి నాతోనే కాలం గడుపుతున్నపుడు
గుమ్మంలోంచి మా అమ్మాయి మబ్బుతునకలా లోనికి వచ్చి
' నాన్నా, ఆకాశం వెళ్ళిపోతోంది చూడు' అంది.

బైటికి వచ్చి చూస్తే
సూర్యకాంతిలో స్వచ్ఛనీలంగా మెరుస్తున్న ఆకాశంలో
తేలికపాటి మబ్బు తునకలు
బడి వదిలిన పిల్లల్లా వేగంగా వెళిపోతున్నాయి

ఇన్ని సంవత్సరాలుగా
నా లోపల కదలకుండా ఉన్న ఆకాశాన్ని
కొన్ని క్షణాలు చలింపచేసి
నాకు ఆశ్చర్యాన్నీ, సంతోషాన్నీ కలిగించింది మా అమ్మాయి

ఏదీ నిలబడకపోవటం వెనుక
ఎంత సంతోషం దాగి వుందీ!

' ఆకాశం ఎక్కడికీ వెళ్ళదమ్మా, మబ్బులు వెళతాయి' అని
పాపతో చెప్పాలనుకొన్నాను
కానీ కదిలే ఆకాశాన్ని నాకు ఇచ్చిన ఆమెకి
కదలని ఆకాశాన్ని ఎలా ఇవ్వను

నిజంగా ఆకాశం ఎప్పుడూ వెళ్ళిపోతూనే ఉందేమో
నాకు మాత్రం ఏం తెలుసు?!

*30.8.2000 రాత్రి 12.30*

*కవిత్వంతో ఒక సాయంకాలం 2001*

# అగరువత్తుల అమ్మాయి

అగరువత్తుల పెట్టెలు పట్టుకొని
ఒక చిన్నారి పాప, తన తమ్ముడితో నా దగ్గరకు వచ్చింది
' రెండుకొంటే ఒకటి ఫ్రీ, తీసుకోండి' అంది
తీసుకొన్నాను

వాటికి అంత పరిమళం ఉండదు
కొన్ని క్షణాలు ఆ చిన్నారులలో వీచే సంతోష పరిమళాలు
నాకు అగరువాసనల కంటే ఎక్కువ ఇష్టం

పక్కన ఉన్న మిత్రుడు నా తెలివి తక్కువ కొనుగోలును కనుగొన్నాడు
' అవి మంచి వాసన రావు' అన్నాడు
అతనితో అన్నాను
' అంతర్జాతీయ రంగునీళ్ళ వ్యాపారుల దగ్గర కంటే
ఈ పిల్లల దగ్గర మోసపోవటం నాకు తృప్తినిస్తుంది' అని

ఏం చెప్పాలి మరి
' తెలివిగా, నిర్దయగా ఉండటం కంటే
తెలివితక్కువగా, దయగా ఉండటం మంచిది' అంటే
అతనికి అర్థమౌతుందా?!

*17.12.2000* సాయంత్రం *4.00*
ప్రకృతి సాహితి ప్రత్యేక సంచిక

# చీకటి

చీకటి పడుతోంది
ఇక సంధ్యాకాశపు స్వర్ణ సైకత తీరం విడచి
మనం నల్లటి సముద్రంలోకి ప్రవేశిస్తాము

పగటిలో మునిగిపోయిన అనంత విశ్వం
ఈ నల్లని కాంతిలో పైకి తేలుతుంది

ఇపుడిక కనురెప్పల రెక్కలు విప్పుకొని
మనం నిగూఢ విశ్వాంతరాళాలకు ఎగురవచ్చును

సూర్యఛత్రం అటునించి ఇటు వాలిపోయాక
మనం చల్లని చుక్కల చినుకుల్లో తడుస్తాము

భూమ్యాకాశపు ముత్యపు చిప్పలు
అమావాస్యలో ఏ వానచినుకును దాచి ఉంచాయో
ఇపుడొక తెల్లని ముత్యం ఆకాశంలో దొర్లుతోంది

ఎంత తవ్వినా తరగని నల్లని బొగ్గుగనిలాంటి
ఈ చీకటిలోనే
మనకు ప్రతిరోజూ ఒక సూర్యవజ్రం దొరుకుతోంది

ఈ చీకటే వెండికాంతి తెరపైన
రంగురంగుల ప్రపంచాన్ని పరుస్తోంది

పగటి అలసటలో రెప్పవేసినపుడు
ఒక్క క్షణం సమస్త విశ్వంలోని చీకటీ
మనకు తోడుగా కనుపాపముందు నిలుస్తోంది

కిరణాల చేతులు పట్టుకొని
పగలంతా నడిచాక
చీకటి అమ్మలా జోకొడుతుంది

తరువాత చీకటే నిద్రగా మనలో ప్రవేశించి
ఎవరూ మనని చేరలేని ఏకాంతపు లోకం తీసుకెళ్ళి
జనన మరణాల ఏకైక రహస్యం చెబుతుంది

*21.8.2001 రాత్రి 11.40*

# సంతోషం అంటే ఏమిటి?

సంతోషం అంటే ఏమిటి?
ఏ రంగులో వుంటుంది?
ఏ పరిమళంతో తెలుస్తుంది?

పూల రంగులు
వాటి వికాసం, మృదుత్వం
ఎవరు ఏ సంతోషంలో ముంచి తీసారు?

పిల్లల కళ్ళ లోని ఆశ్చర్యం, పట్టరాని ఉత్సాహం
దిగులు జ్ఞాపకాల నుండీ, బద్ధకపు కలల నుండీ
మనల్ని ఈ క్షణంలోకి తరిమే వారి ఉత్సవం
మనతో ఏ సంతోషపు దాగుడుమూతల ఆట!

సంతోషం ఎప్పటికీ రహస్యమే!

పూలరేకుల్నీ, పక్షులరెక్కల్నీ, పిల్లల అల్లరినీ
తెరుస్తోంది భూమి రోజూ

భూమి నిరంతరం తెరుచుకొంటోంది
సముద్రం అలల రెప్పల్ని తెరుస్తోంది నిరంతరం
ఆకాశం కోట్ల నక్షత్రాలయి తెరుచుకొంటోంది

సమస్త విశ్వమూ నిరంతరమూ
ఒకటే రహస్యంలోంచి
ఒకటే ఆశ్చర్యంలోకి తెరుచుకోవటం!

బహుశా ఎప్పటికీ రహస్యంగా వుండే సంతోషమే
నిరంతరమూ
తన ఆశ్చర్యంలోకి తానే విప్పారుతూ వుంటుంది!

*21.8.2001 రాత్రి 12.20*

# జీవించటం గురించి

నువ్వు వస్తావని ఎదురుచూస్తాను
నీ కోసం నా లోపలి తలుపులన్నీ తెరిచి వుంచుతాను
నువ్వు రావు. వచ్చినా నా నువ్వుగా రాలేవు

తలుపులు మూసుకొంటాయి
గదుల నిండా చీకటిని నింపుకొంటాయి
జీవించటం మొదలుకాదు. కాలం ఆగదు

ఎప్పుడో ఎదురౌతాము
నన్ను గుర్తుపట్టా ననుకొంటావు
గుర్తుపట్టలేవు

అప్పుడు నీ నేను ఉండను
నీ నేనుగా ఉన్నప్పుడు
నేను మాట్లాడిన భాష నీకు అర్థం కాలేదు

పగలూ, రాత్రీ మనం ఒకే చీకటిలో తిరుగుతుంటాము
మనం ఒకరినొకరు ఎన్నటికీ తాకలేము

. . .

అందరం ఏదో అనుభవించాలనే ఇక్కడికి వస్తాము
అనుభవం అంటే మనకు తెలీదు
నువ్వు అంటావు 'సంపాదించు, అనుభవించు
ఈ పదార్థాలు, వస్తువులు ఇలా అనుభవించాలి'
నాకు అర్థంకాదు

నాకు అనుభవమంటే
చలనాల నుండీ నిశ్చలం లోకీ
శబ్దాల నుండి నిశ్శబ్దం లోకీ కరిగిపోవటం

మనం ఒకరికొకరం సమీపంగా కూర్చొన్నపుడు
మన మనస్సులూ, శరీరాలూ ఒకే దయలోకి లయించిపోవటం

'నువ్వు కవిత్వం మాట్లాడుతున్నా'వని నిందిస్తావు
'నేను జీవించటం గురించి మాట్లాడగలను
వ్యాపారం గురించి మాట్లాడలే'నని జవాబు చెబుతాను

బహుశా, అదృష్ట వంతురాలివి
నీలోపల చీకటి గదులున్న సంగతి నీకు తెలీదు
నేను నాలోపలి చీకటిని చూసి భయపడతాను
నాలోపలి చీకటిలో ఒంటరినయి దుఃఖిస్తాను

తలుపులు మూసి ఉంచలేను
ఎవరి కోసమూ తెరిచీ ఉంచలేను
జీవించటం ఆగిపోతుంది. కాలం ఆగదు

. . .

ఒకనాటికి మరణిస్తాం కదా
మన చివరి క్షణాలలో
ఒకరికొకరం వేలమైళ్ళ దూరంలో ఉంటాం
బహుశా మనం మరణించాక కూడా
ఒకటి కాలేనంత దూరంలో..

*27.8.2001 సాయంత్రం 6.00*

# దు:ఖస్వప్నం

పగటి తరువాత పగలు
మృదువుగా చీకటిలోనికి జారిపోతూ వుంది

ఈ కనులు ఎన్నో రోజులని చూసాయి
ఇక అలసిపోతున్నాయి
రెప్పలు మూతపడుతున్నాయి

కొంచెం మట్టి, కొంచెం నీరు, కొంచెం శ్వాస
ఎందుకు ఇలా కలిసాయి?
ఏ కలని ఇవి చిత్రించాలనుకొన్నాయి?

కల ఏమిటో అర్థం కాకుండానే
కలలోని రంగులు కరిగిపోతున్నాయి

. . .

బహుశా, ఆమె నా స్వప్నం
ఆమెని వెదకాలని వుంటుంది
ఆమెని చూడాలని వుంటుంది

కానీ, ఆమె ఎవరో తెలీదు
ఎలా వుంటుందో తెలీదు
ఏ దు:ఖం నుండి ఏ శాంతికి
ఏ చీకటి నుండి ఏ కాంతికి
ఆమె నన్ను నడిపించగలదో తెలీదు

కానీ ఆమెని వెదకాలి

ఈ చీకటిలోనే
ఈ భయంలోనే
ఈ ఏకాకితనంలోనే
తడుముకొంటూ అయినా ఆమె పాదాలని తాకాలి

ఆమె కన్నులలో ప్రవహించే ఓదార్పుని చూడాలి
తల నిమిరే ఆమె చేతులమీది నమ్మకంతో
యుగాల దుఃఖం మరచి నిద్రించాలి

ఎవరెవరినో అడుగుతాను
'ఆమె నువ్వేనా' అని
'నిన్ను నేను కనుగొన్నానా?' అని
వారికి నా మాటలు అర్థంకావు

'నీలోనికి వెదికి చూడు, ఆమె నువ్వేనా'
వారు తడబడే మువ్వల శబ్దాలతో
చీకటిలోనికి నడిచి వెళ్ళిపోతారు

బహుశా, వారు వెలుతురులోకి వెళ్ళి వుంటారు
నేనే చీకటిలోనికి నడిచి వుంటాను

. . .

హృదయం శిశిరంలో వృక్షంలా ఏకాకిగా మిగులుతుంది
దాని కలల పత్రాలు, పుష్పాలు రాలిపోతాయి
ఎండిన దాని కొమ్మల్ని తాకి
వెలుతురూ కూడా రాలిపోతుంది

చీకటి ఒకటే
దానిని తన గర్భాలయంలో దాచుకొంటుంది

. . .

తెలియదు. ఎందుకు వెదకాలో తెలీదు
దు:ఖంలో వెదుకుతున్నానో
వెదకటం వలన దు:ఖిస్తున్నానో తెలీదు

బహుశా అందరమూ అంతే
దేనినో వెదికేందుకు పుడతాం
దొరికేది ఏదీ వెదికేది కాదని తెలుస్తుంది

వెదికే ఆట చాలాకాలం ఆడాక గుర్తుకువస్తుంది
ఏది వెదకాలో మరిచిపోయామనే సంగతి
ఏది వెదకాలో తెలీదు. తెలిసినా, ఎలా వెదకాలో తెలీదు

కొన్ని శబ్దాలు కొన్ని ప్రతీకలు మినహా
ఒక్క అర్థమైనా అనుభవంలోకి రాదు
ఏదీ తెలియకుండా పుట్టినంత సహజంగా
ఏదీ తెలియకుండా మరణిస్తాం

కలత నిద్రలో వచ్చిన
మొదలూ, చివరా లేని స్వప్నంలా
ఒక గాడాంధకారంలో
మొదలూ, చివరా లేని ఒక జీవితాన్ని జీవించి వెళతాం

. . .

కలలోని గాలిపటంలా
రోజు తర్వాత రోజు
సూర్యుడు ఆకాశంలో ఎగురుతూనే వుంటాడు

*14.11.2001* సాయంత్రం *5.20*

# మంచుబిందువు

ఉదయాన్నే మంచుబిందువులు
ఆకాశం నుండి పిట్టల వలె ఎగురుతూ వచ్చి
గడ్డిపరకలపై వాలతాయి

వస్తూ, వస్తూ
ఒక్కొక్క చల్లని సూర్యుని వెంట తెచ్చుకొంటాయి

వాటితో
'ఇన్ని సంవత్సరాలలో
ఒక్క సూర్యుడైనా నాలో ప్రతిఫలించలేదు.
మీలో ఎలా నిలిచాడు?' అంటాను

'మా వలే పారదర్శకంగా ఉండు.
నీలో విశ్వమంతా ప్రతిఫలిస్తుంది' అంటాయి

చూస్తూ ఉండగానే
వర్ణ వర్ణాలుగా రెక్కల్ని అల్లార్చుతూ
కనిపించే లోకం నుండి కనిపించని లోకానికి ఎగిరిపోతాయి

మంచు నివసించిన జ్ఞాపకాలు ఏవో
గడ్డిపరకలపై గాలికి ఊగుతుంటాయి

*13.12.2001* రాత్రి *1.25*

ఆదివారం . వార్త దినపత్రిక *17.3.2002*

# దృష్టి మాత్రమే

చెట్లు చిగురిస్తాయి. పూలు పూస్తాయి
పుష్పదళాలతో, పత్రాలతో చెట్లు వికసించి
వేల స్వరాలతో జీవనోత్సవ సంగీతం పాడతాయి

ఋతువులు మారతాయి
పుష్పాలు రాలిపోతాయి. పత్రాలు వాడిపోతాయి
ఏవో విషాద స్వరాలు
క్రమంగా ఏదో మహా నిశ్శబ్దంలోకి తరలిపోతాయి

ఇవాల్టి ఉత్సవ సంగీతంలో
రేపటి విషాద స్వరాల నీడలుంటాయి
రేపటి విషాద స్వరాల వెనుక
మరునాటి ఉత్సవ సంగీతపు కాంతులుంటాయి

చెట్లలోంచీ, పిట్టల లోంచీ, మానవుల లోంచీ
జీవితం యుగాలుగా ఒకే సంగీతం వినిపిస్తోంది

. . .

ఒకసారి నన్ను జీవితం భయపెడుతుంది
మరొకసారి మరణం భయపెడుతుంది
రెండు భయాలూ ఒకే వలయమై
నన్ను తమలోనికి లాగుతుంటాయి
నన్ను, నా నుండి వేరుచేసే ప్రయత్నమేదో చేస్తుంటాయి

. . .

కలగంటూ ఉలికిపడే మనసులోకి
అకస్మాత్తుగా ప్రవేశించే మెలకువలా
ఒక ప్రశ్న నాలో ప్రవేశిస్తుంది
ఇది అంతా ఏమిటి?!

ఒకే చూపు, రెండు కన్నుల వెంట ప్రసరించినట్లు
ఒకటే ప్రశ్న రెండు ప్రశ్నలుగా వ్యక్తమౌతుంది
సృష్టి అంటే ఏమిటి?! నేను అంటే ఏమిటి?!

జవాబులేని రెండు ప్రశ్నలూ
రెండు రెక్కలవలే ఊగి
ఏదో మహామౌనంలోకి తీసుకుపోతాయి

చూస్తూ వుండగానే
సృష్టీ, నేనూ పొగమంచువలే కరిగిపోతాము

దృష్టి ఒకటే
ఏదీ తాకలేని ఆకాశంలా
ఆకాశమంత సూర్యునిలా ప్రకాశిస్తుంది

*27.1.2002 రాత్రి 1.40*

# ఏదీ తాకలేవు

హాలునిండా చీకటిని నింపి
బైటికి ఒలికిపోకుండా తలుపులు మూసేస్తారు

హాలులోకి రహస్యంగా ప్రవేశించే కాంతి ఏదో
ఆకాశం వంటి తెరమీద
రంగురంగుల బొమ్మలుగా ప్రతిఫలిస్తుంది

ఇంతలో పసివాడు ఒకడు
తెరమీది రంగుల్ని తాకబోతాడు
చేతికి తెరతప్ప ఏమీ తగలదు

వెలుతురు బొమ్మలు
ఏ స్పర్శనీ ఇవ్వకుండానే
చేతిమీదుగా తరలిపోతాయి

వాడి అమ్మ అంటుంది
నువ్వు చూడగలవే కాని తాకలేవు

. . .

నిద్ర చీకటిలోకి
రహస్యంగా ప్రవేశించే కాంతి ఏదో
రంగురంగుల కలల్ని ప్రతిఫలిస్తుంది

కలలో నేను దేనినో తాకబోతాను
ఎవరో అంటారు

నువ్వు చూడగలవే కాని
దేనినీ నువ్వు తాకలేవు
ఏదీ నిన్ను తాకలేదు

. . .

హాలులోంచీ, కలలోంచీ
వెలుపలికి వచ్చినపుడల్లా
నన్ను నేను ప్రశ్నించుకొంటాను

ఎవరు దాచిన చీకటిలోకి
ఏ కాంతి రహస్యంగా ప్రవేశించి
సృష్టి వలే ప్రతిఫలించింది?

ప్రపంచాన్ని నేనూ
నన్ను ప్రపంచమూ
ఎప్పటికైనా తాకగలమా?!

ఎప్పటికైనా నేను
నా శరీరాన్నైనా తాకగలనా?!

*8.2.2002 ఉదయం 9.15*
ఆదివారం . వార్త దినపత్రిక *10.10.2004*
కవిత *2004*

# ఇస్మాయిల్ గారికి

ఉరుములూ, పిడుగులూ, నీటిధారలూ
వచ్చి వెళ్ళిపోతాయి
వాన వెలిసాక ఆకాశం
పసిపాప ముఖంలోని కాంతీ, నైర్మల్యమూ
మా పైకి వొంపుతుంది
అప్పుడు మా లోపలి జీవనానందం ఏదో
మెత్తపడి చిగురులెత్తుతుంది
అప్పటికి కాని, వాన కురవటం పూర్తి కాదు

ఉరుములూ, పిడుగులూ, నీటిధారలూ రాల్చి
మేం కవిత్వం పాడుకొంటాము
అవి అన్నీ మీలోనే రాల్చుకొని
పసిపాప ముఖంలోని కాంతీ, నైర్మల్యమూ
మాపైకి వొంపుతారు మీరు
అప్పటికి కాని కవిత్వం పాడటం పూర్తికాదు

నిశ్చలంగా ఉన్న కొలనులోకి
రాళ్ళువేసి అలలు రేపుతాము
కలతపడే కొలనులో
ఏ ప్రతిబింబమూ కనిపించక కలవరపడతాము

అప్పుడు మీరు
చిరుగాలి చివరి తెరల వలే వచ్చి

మృదువుగా అలల తలలు నిమురుతారు
అలలన్నీ శమించి
ఆకాశమంత జీవితం మాలోపల ప్రతిఫలిస్తుంది

మనసులో ఉద్వేగాలనీ
తెల్లకాగితంపై మాటల్నీ చెక్కి చూసుకొని
మురిసిపోతూ వుంటాము
ఉద్వేగాల మధ్య ప్రశాంతతనీ
మాటల మధ్య నిశ్శబ్దాలనీ అమర్చి చూపించి
చిరునవ్వు నవ్వుతారు మీరు

ఇస్మాయిల్ గారూ!
కవిత్వమంటే అక్షరాలు సృష్టించటమా
అక్షరాలు చెరపటమా?!
తెల్లకాగితానికీ
కవిత్వం రాసిన తెల్లకాగితానికీ మధ్య
మీరు ఎంత దూరం ఎట్లా నడిచారు?!

*6.5.2002*
*ఇస్మాయిల్ అభినందన సంచిక 15.6.2002*

# సీతాకోక రంగుల ప్రయాణం

వేసవి మధ్యాహ్నం
చెట్లనీడలో ఇసుకపైన వాలింది సీతాకోక
తన రంగుల రెక్కల్ని విప్పుతూ, ఆర్పుతూ వుంది.

విప్పిన ప్రతిసారీ
ఒక కొత్త ప్రపంచం నా కళ్ళముందు పరుచుకొంటూ వుంది.

బహుశా, అది రెక్కలు మూసిన ప్రతిసారీ
ఏ సూక్ష్మ రహస్య లోకాలనుండో
ఒక్కొక్క ప్రపంచం వాటిపైన వాలుతుందనుకొంటాను.

సీతాకోక రెక్కలు విప్పినపుడల్లా
ఒక్కొక్క ప్రపంచం
ఈ వేసవి మధ్యాహ్నపు ఆకాశంలో
చప్పుడు చేయకుండా కరిగిపోతూ ఉంటుంది.

బహుశా, ఈ రంగుల ప్రపంచాలే
ఆకాశం ద్రవించి కారుణ్య వర్షమై కురుస్తున్నపుడు
ఇంద్రధనస్సులై కనిపించి, ప్రపంచాన్ని దీవించి
సూక్ష్మ రహస్యలోకాలకు మరలా తరలిపోతాయి

*6.5.2003* మధ్యాహ్నం *2.30*

# నిన్ను ఊహించటమే...

నా ప్రపంచం వెనుక నీ స్మృతి
అంతర్గత సంగీతంలా ప్రవహిస్తూనే ఉంటుంది

నా విరామాలలో అల తీరాన్ని తాకినట్లు
నీ జ్ఞాపకం నన్ను కోమలంగా తాకుతుంది
సంతోషమో, విచారమో తెలియని వ్యాకులతలో
సంధ్యాకాశంలా స్తబ్దంగా ఉండిపోతాను

పగటి దు:ఖాలపైకి రాత్రి దయగా అవతరించినట్లు
నువ్వు నా లోపల మృదువుగా అవతరిస్తావు

నువ్వు దూరంగా ఉన్నావని దు:ఖించాలని ఉంటుంది
నా లోపల నా కన్నా దగ్గరగా ఉండి నవ్వుతావు

నీ స్మృతిలో ఉంటానా
క్రమంగా నువ్వు నన్ను ఆవరిస్తావు
తెప్పరిల్లి గమనిస్తే నేను నువ్వుగా ఉంటాను

నేను, నేనుగా ఉండటం కన్నా
నువ్వుగా ఉండటంలోనే ప్రశాంతత కలుగుతోంది నాకు

బహుశా నేను నేనుగా ఉండటం నా ఊహ అయి వుంటుంది
నువ్వుగా ఉండటం వాస్తవం అయి వుంటుంది

ఇప్పుడు అనిపిస్తోంది..
నా బాల్యంలో
నిన్ను ఊహించేందుకే ఊహ తెలిసింది నాకు
కానీ, నిన్ను ఊహించటమే
నిన్ను నాకు దూరం చేసినట్లుంది

*22.4.2004 రాత్రి*

*ఆదివారం . ఆంధ్రజ్యోతి దినపత్రిక 23.5.2004*

## బయోడేటా

| | |
|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ |
| పుట్టినతేదీ | : 21. 11. 1966 |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి |

| | | | |
|---|---|---|---|
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | 1989 |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | 1995 |
| | హైకూ | (హైకూలు) | 1997 |
| | పూలురాలాయి | (హైకూలు) | 1999 |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | 2006 |
| | ఆకాశం | (వచన కవిత్వం) | 2011 |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | 2015 |

| | | |
|---|---|---|
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | 2004 |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | 2012 |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | 2011 |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | 2011 |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | 2011 |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | 2015 |
| | తిలక్ అవార్డు, తణుకు | 2016 |


చిరునామా : బివివి ప్రసాద్, # 23-12-21, సజ్జాపురం, తణుకు,
పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ 534 211

ఫోన్ : 90320 75415

ఈ మెయిల్ : prasadbvv1@gmail.com

బ్లాగ్ : bvvprasad.blogspot.in

# Nene Ee Kshanam

B.V.V. Prasad

నిద్రలో పాప పెదాలమీద
ఒక నవ్వు సీతాకోకలా
రెక్కలు విప్పి ఎగిరిపోయింది.

☆ ☆ ☆

ఆమె ఉన్న ప్రపంచం కదా ఇది.
ఈ ప్రపంచాన్ని మరింత ప్రేమించాలి.
నా ప్రేమ అలలై పరుగులెత్తి
అజ్ఞాత తీరాన ఉన్న ఆమెని తాకాలి.

☆ ☆ ☆

కలనించి మేలుకొన్నట్టు
మెలకువనించీ మేలుకోవాలనిపిస్తుంది.
ఇంత జీవించే రొదలోనూ,
ఏదో నిశ్శబ్దం వెంటాడుతుంది.

☆ ☆ ☆

ప్రపంచాన్ని నేనూ,
నన్ను ప్రపంచమూ
ఎప్పటికైనా తాకగలమా?!
ఎప్పటికైనా నేను,
నా శరీరాన్నైనా తాకగలనా?!

☆ ☆ ☆

నేను, నేనుగా వుండటం కన్నా
నువ్వుగా వుండటంలోనే ప్రశాంతత కలుగుతోంది నాకు.
బహుశా, నేను, నేనుగా వుండటం
నా ఊహ అయి వుంటుంది.
నువ్వుగా వుండటం వాస్తవం అయి వుంటుంది.

☆ ☆ ☆

నీలో నువు ఊహించినట్టే, కలగన్నట్టే
ఏదో ఆద్యంతాలు లేని ప్రేమ
తనలో నిన్నూ ఊహిస్తూ వుంది. కలగంటూ వుంది.

P O E T R Y

